# ఎరుక

## శ్రీ నిసర్గదత్త మహరాజ్ ముఖ్యబోధామృతవాక్యములు

శ్రీ నిసర్గదత్త మహరాజ్ గారి అమృతతుల్యమైన, ఆత్మనిశ్చయమైన వాణి నుంచి ప్రకటమై సాధకులను ప్రభావితం చేసే, హృదయాన్ని స్పృశించే, జ్ఞానవాక్య సంకలనము.


*హిందీ అనువాదము*

సచిన్ క్షీరసాగర్

రాహుల్ గజభియే

*తెలుగు అనువాదము*

బ్రాహ్మణపల్లి శ్రీధరబాబు

# ముందుమాట

శ్రీ నిసర్గదత్త మహరాజ్ యొక్క అక్షరసాహిత్యాలలో నుండి హృదయాన్ని స్పృశించే కొన్ని దుర్లభమైన జ్ఞానవాక్యముల సంకలనమును హిందీలోకి అనువదించి సాధకభక్తులందరికీ అందజేయడం మాకు చాలా ఆనందాన్ని ఇస్తున్నది. “శ్రీ నిసర్గదత్త బోధ సుధ” అనే పేరు గల మరాఠీ ప్రముఖవాక్య సంకలనమునకు మేము అందించిన "పహచాన్" హిందీ అనువాదం. శ్రీ నిసర్గదత్త మహరాజ్ వారి సన్నిహిత ప్రియశిష్యుడు శ్రీ శ్రీకాంత్ గోగటే గారు ఈ మూల మరాఠీ వచన సంకలనాన్ని 1975 వ సంవత్సరంలో శ్రీ మహారాజ్ గారి సమక్షంలో ప్రచురించారు. ఆ తర్వాత శ్రీ సతీష్ ఆహ్వాడ్ గారు 2001 లో రెండవ సంచికను తిరిగి ప్రచురించారు. మేము ఈ హిందీ అనువాదం "పహచాన్"ను శ్రీ మహరాజ్ గార్కి, వారి సమీప శిష్యులు శ్రీ గోగటే గార్కి, మరియు ఆహ్వాడ్ గార్కి అంకితం చేస్తున్నాము.

ఈ హిందీ అనువాదానికి "పహచాన్(గుర్తింపు)" అని పేరు పెట్టేటప్పుడు, ఇచట గుర్తింపు అంటే – ఎవరి చేత గుర్తింపు?, దేనిని గుర్తించాలి?, ఎవరు దేనిని గుర్తించాలి?, ఈ ఆలోచనలు నా మనస్సులో ఉన్నాయి. ఆధ్యాత్మికత, పరమార్థం, భక్తి, సాధన, యోగ, ధ్యాన, నామస్మరణ - ఇవన్నీ “గుర్తింపు”కు సంబంధించినవి. తమను తాము గుర్తించడానికి చేసే వివిధ ప్రయత్నాలకు ఈవిధంగా వివిధపేర్లు ఇవ్వబడ్డాయి. ఆపైన ఈ ప్రయత్నాల మార్గాలకు వివిధ సాంప్రదాయాల పేర్లు ఇవ్వబడ్డాయి.

ఇక్కడ ‘తనకు తనపై గుర్తింపు’ ఉంటే సరిపోతుంది. దైవప్రాప్తి, దైవసంయోగము లేక జ్ఞానప్రాప్తి, ఇది బయటి నుండి పొందడం సరిపోదు, అది తనను తానే గుర్తించడం. ఏ దేవుడూ బయటి నుండి మీ వద్దకు వచ్చి కలవడు, అది మిమ్మల్ని మీరే గుర్తించడం ద్వారా మాత్రమే జరగబోతోంది. తనను తానే గుర్తించడం అంటే చైతన్యాన్ని చైతన్యం గుర్తించడం. చైతన్యం సమక్షంలో మనం ఏమిటి?, చైతన్యం లేని స్థితిలో మనం ఎలా ఉన్నామో?, గుర్తించడం.

మనిషికి అన్ని విషయాల గురించి తెలుసు, తనకంటే ఎక్కువగా తనతో పరిచయం ఉన్న ఇతరులను గురించి అతను తెలుసుకొంటుంటాడు, కానీ అతనికి తనగురించి పూర్తిగా తెలియదు. గతంలోని విషయాలను గుర్తుచేసుకోవడం ద్వారా ఇబ్బంది పడటం, కొన్నిసార్లు ప్రస్తుత పరిస్థితులలోని సమస్యలు లేదా భవిష్యత్తులో ఎలా ఉంటుందో అని, ఈ గందరగోళ సమస్యలతో అంటే గతం, భవిష్యత్తు, వర్తమానం గురించి ఆందోళన చెందుతూ ఉంటాడు. వాస్తవానికి అతనికి పరిస్థితి గురించిన ఆందోళన

లేదు, కానీ అతను ఎల్లప్పుడూ తన చైతన్యం క్రమబద్ధంగా, సురక్షితంగా, సంతోషంగా ఉండాలను కొంటాడు. అయితే తెలియని స్థితి కారణంగా, దీనికి చింత అని పేరు పెట్టారు. ఒక వ్యక్తి తన జీవితాన్ని ఎదుర్కోవడానికే ప్రయత్నిస్తున్నప్పుడు, అతని ప్రయత్నాలన్నీ కేవలం చైతన్యాన్ని ప్రసన్నం చేసుకునే ప్రయత్నాలే. అయితే తనను శరీరంగా భావించి ఆ ప్రయత్నం చేయడం వలన, దానికి ప్రపంచం అనే పేరు ఇవ్వబడింది.

తన కోసం అంటే దేవుడి కోసం చేసే అన్వేషణ యొక్క పేరు ఆధ్యాత్మికత. మనిషి ఎల్లప్పుడూ మంచి పరిస్థితుల కోసం వెతుకుతూ ఉంటాడు. మరొక వ్యక్తితో పరిచయంలో నేను ఎలా సంతోషంగా ఉండగలను, ఎల్లప్పుడూ ఇలాంటి వెతుకులాటలోనే ఉంటాడు. ద్వైతంలో ఉంటూ, తనతో తాను తాదాత్మ్యంచెంది ఆనందం కోసం వెతుకుతాడు. వాస్తవానికి ఈ సంఘటనలన్నింటినీ లోతుగా ఆలోచించడం ద్వారా, ఒక వ్యక్తి ఈ సంఘటనలన్నింటిలో పాలుపంచుకోవడం ద్వారా తనను తాను మరచిపోతాడు. ఉదాహరణకు - మొబైల్‌లో ఎప్పుడూ ఏదో ఒకటి చూడటం, అందులో ఆడుకోవడం, టెలివిజన్ చూడటం, వేరే చదవడం లేదా ఏదో ఒక ప్రదేశానికి వెళ్ళడం. అపుడు అతను ఏమి చేస్తుంటాడు, అప్పుడు అతను తనతో తాను సంభాషిస్తుంటాడు. తనతో అంటే చైతన్యంతో మాట్లాడుతూనే ఉంటాడు. చైతన్యాన్ని మర్చిపోయిన సమయంలో అతను మంచి అనుభూతి చెందడం ప్రారంభిస్తాడు, అపుడు తెలియనిస్థితిలో అతను తన వైపుకు వెళ్తుంటాడు. కానీ అది అతనికి అర్థం కాదు, ప్రతిరోజు రాత్రి అతను నిద్రలో చైతన్యాన్ని మరచిపోకపోతే అతను రోజంతా తాజాగా ఉత్సాహంగా అనుభూతి చెందడు. నిద్రలో ఎవరు మర్చిపోతారో వారికి ఖచ్చితంగా ఆనందం ఉంటుంది. ఎందుకంటే అతడు అజ్ఞానంలో మర్చిపోతాడు, కాబట్టి అది ప్రతిరోజు జరిగుతున్నది, అప్పుడు కూడా అది పూర్తి సంతృప్తిని ఇవ్వదు. నిజానికి, మనిషి జాగృతిస్థితిలో తనను తాను మరచిపోయి జాగృతిసుషుప్తిలో ఉండాల్సిన అవసరం ఉంది.

అతనికి ఈ జాగృతిసుషుప్తి యొక్క అవసరం ఉంది. అంటే, అతను తనను తాను అన్వేషించుకోవాల్సిన అవసరం ఉంది. మనిషి ఎప్పుడు జాగృతిసుషుప్తి లో ఉంటాడో, అప్పుడు అతడు తన శుద్ధస్వరూపస్థితిలో ఉంటాడు. దానిని మనం ''మేల్కొని ఉన్నాము, కానీ ఆలోచనా రహితంగా ఉన్నాము" అని చెప్పగలము.

'స్వ' అంటే చైతన్యానికంటే ముందు ఉన్నది, చైతన్యం కంటే అన్యమైనది, అదే ధ్యానంలో వస్తుంది, అదే 'స్వ '. ఎప్పుడెప్పుడు చైతన్యం యొక్క అభావం ఉంటుందో, అప్పుడు మనిషికి నిజమైన ఆనందం, నిజమైన సంతోషం ఉంటుంది, దానిని మనం స్వరూపం యొక్క ఆనందం అని పిలవగలము. చైతన్యం, చైతన్యానికి అతీతంగా చేరుకున్నపుడు, అక్కడ స్వరూపం యొక్క ఆనందం ఉంటుంది. చైతన్యం, చైతన్యానికి అతీతంగా చేరుకున్న తరువాత, స్వయంలో స్థిరపడి, స్వయాన్ని గుర్తించడం - ఈ ఆశ ఇక్కడ ఉంది. చైతన్యం, చైతన్యాన్ని ఎప్పుడు మరిచిపోతుందో, అప్పుడు మనం చైతన్యానికంటే ముందే ఉన్నామని గుర్తిస్తాము, మరియు ఈ గుర్తింపుకలుగుతుందనే ఆశ ఇక్కడ ఉంది.

గుర్తింపు పొందాలంటే, అక్కడికి ఎలా చేరుకోవాలో, ఇది కూడా గుర్తించాల్సిన అవసరం ఉంది. దీన్ని గుర్తించడానికి ఏమి చేయాలి, తనపై తాను ధ్యాస పెడుతూ ఉండాలి, అనగా చైతన్యం చైతన్యంమీద ధ్యానం పెడుతూ ఉండాలి. ధ్యానం చేస్తున్నప్పుడు చైతన్యం కరిగిపోతుంటుంది, మరియు దాని వెనుకవుండి దానిని తెలుసుకొనేవాడు ఎల్లప్పుడూ ఉన్నాడు. బ్రహ్మము బ్రహ్మమును మింగినపుడు, మిగిలి ఉన్నది పరబ్రహ్మ!, ఇక అతనిని గుర్తించడమే ఇక్కడ ఆసక్తికరమైనది.

ఈ పదాల సంకలనంలోని సాధన విభాగంలో శ్రీ మహరాజ్ గారు సాధకుడిని కొంత సాధన చేయమని చెపుతారు. వారు స్వయంగా తాను కాదని, సాధకుని చైతన్యం యొక్క మూలం వైపు వెళ్ళమని చెపుతారు. సాధకుని, స్వయానికి దూరంగా ఉండి, స్వయంమీద ధ్యానం పెట్టమని చెపుతారు. స్వయమును సాక్షిగా చూసుకోవాలని చెపుతారు.

అంతిమంగా ఇది గుర్తించబడిన తర్వాత ఏమి జరుగుతుందో, అప్పుడు సాధకుడు స్వయాన్ని గుర్తించిన తర్వాత అతనికి సిద్ధ అనే పేరు వస్తుంది, అతను స్వేచ్ఛ పొందుతాడు. సంతోషాన్ని పొందడం కోసం అతను ఎలాంటి పరిస్థితులపై ఆధారపడడు, ఎందుకంటే తనను తాను తెలుసుకున్న తర్వాత అతను సుఖ దుఃఖాలను దాటిపోతాడు. స్వయాన్ని సంతోషపెట్టుటకు అతను ఎలాంటి బాహ్య పరిస్థితులు లేదా సంఘటనలపై ఆధారపడడు. సుఖంగా ఉండడానికి, అతనికి ఏవిధమైన బయటి ఉపచారము కూడా అవసరం లేదు. కనిపించే దృశ్యం క్షణికమైనది అనేది అతనికి ఖచ్చితంగా స్మరణలో ఉంటుంది. కనిపించేదంతా క్షణికం, మరియు ''నేను" ఎల్లప్పుడూ శాశ్వతంగా ఉంటాను – అనే జ్ఞానం అతనికి ఉంటుంది. అన్ని అజ్ఞాన జ్ఞాపకాలను అతను మరచిపోతాడు, మరియు అతను అలా ఉండడంతో, అతను ఆలోచనా రహిత స్థితిలో స్థిరంగా ఉంటాడు.

స్వయం ఆవలకు చేరుకోవడానికి శ్రీ మహరాజ్ గారు శుద్ధచైతన్యాన్ని గుర్తించాలని కోరారు. ''గుర్తింపు" యొక్క గుర్తింపు, శ్రీ మహరాజ్ గారి దయ ద్వారా జరగాలి – ఇది శ్రీ మహరాజ్ గారికి నా ప్రార్థన!

సచిన్ క్షీరసాగర్

శ్రీ నిసర్గదత్త మహారాజ్ జీ యొక్క మరాఠీ పదాలను హిందీలోకి అనువదించడానికి నాకు ఈ సేవా-సంధి ప్రాప్తించినది. ఈ అదృష్టమును అభివర్ణించడానికి నా దగ్గర పదాలు లేవు.

నాకు నాతల్లి గారి అభ్యాసము కొరకు 'ఐ యామ్ దట్' అనే అమూల్యమైన ఆంగ్ల పుస్తకం యొక్క మరాఠీ అనువాద ప్రతిరూపం (దివ్య సంవాదము) కావాలి. దానికోసం ఆఅద్భుతపుస్తకము గురించి తెలుసుకొనుటకై అకస్మాత్తుగా Google లో Search చేయునపుడు శ్రీ సచిన్ క్షీరసాగర్ గారి ఫోన్ నెంబర్ లభించగా, నేను వారితో సంప్రదించాను. ఇది వారితో నా యొక్క మొదటిసమావేశము. ఈ మొదటిసమావేశములోనే శ్రీ సచిన్ గారు నేను ఈ 'పహచాన్' బోధవచనముల సంకలనమును హిందీలో అనువదించాలని తమ కోరికను వ్యక్తం చేశారు, నేను ఈ నిస్వార్థ సేవను ఆశీర్వాదంగా భావించి సంకోచము లేకుండా వారి అభ్యర్థనను స్వీకరించాను. ప్రారంభంలో ఈ ఆశీర్వాదం నాకు అర్థం కాలేదు, కానీ కొంత విరామం తర్వాత, శ్రీ సద్గురు ద్వారా పొందిన ఈ ఆశీర్వాదం యొక్క విలువ, నాకు పూర్తిగా అర్థం అయింది.

**ఎప్పుడైతే ఒకరు సంసిద్ధులవుతారో, అప్పుడు సద్గురువు ప్రకటమవుతారు.**

ఆధ్యాత్మిక మార్గంలో నడుస్తున్న జిజ్ఞాసువులైన సాధకులు, ఈ "పహచాన్ " సంకలనం ద్వారా తమను తాము తెలుసుకొనే జ్ఞానము పొందాలని నేను ఆశిస్తున్నాను, నేను శ్రీ మహారాజ్ జీ ని అదే ప్రార్థిస్తాను.

ధన్యవాదాలు!

శ్రీ రాహుల్ గజభియే

శ్రీ సచిన్ క్షీరసాగర్ గారు హిందీలోని ''పహచాన్'' అనే శ్రీ నిసర్గదత్త మహరాజ్ గారి అమృత, జ్ఞాన, వచనసంకలనమును తెలుగులో అనువదించుటకు నాకు అద్భుతమైన అవకాశం ఇచ్చారు.

ఈ వచనామృతం చదివిన తరువాత శ్రీ నిసర్గదత్త మహరాజ్ గారు ఆ ''ఎరుక'' యొక్క శివతాండవ రూపమేనని నాకు అనిపించినది.

"పహచాన్ నా"(హిందీ) అంటే తెలుసుకొనడం, గుర్తించడం, ఎరగటం- క్రియా పదములు.
"పహచాన్" (హిందీ) అంటే తెలుసు, గుర్తింపు, ఎరుక- నామవాచకములు.
తనను తాను తెలుసుకోవడమే, గుర్తించటమే, ఎరుగుటయే - ఎరుక.

శ్రీ నిసర్గదత్త మహరాజ్ గారి అమృత పలుకులు చదువుతూవుంటే వాటిపై ధ్యాసపెడితే, ధ్యానం చేస్తే, విచారిస్తే శ్రీ నిసర్గదత్త మహరాజ్ గారు తమ అమృతవచనాలతో, చిన్నిచిన్ని మాటలతో "ఎరుక"ను ఉగ్గుపాలతో త్రాగిస్తున్నారని అనిపిస్తుంది.

తనను తాను తెలుసుకున్న మనిషి రాగద్వేషాలకు, సుఖదుఃఖాలకు అతీతంగా ఉంటాడు. ఎరుకలోనికి ప్రవేశించిన వారిని గానీ, ఎరుకను తనలోనికి ప్రవేశించుటకు అవకాశం ఇచ్చినవారిని గానీ, ''ఎరుక'' రాగద్వేషాలకు, సుఖదుఃఖాలకు అతీతంగా ఉంచుతుంది.

ఎవరైతే రాగద్వేషాలకు, సుఖదుఃఖాలకు, పొగడ్తలకు, అవమానాలకు తమ ప్రతిచర్యలను గమనించడానికి, సర్వం త్యాగం చేయ సంసిద్ధులవుతారో వారి కోసం ''ఆ ప్రేమ'', ''ఎరుక'' తపనపడుతుంది.

"ఎరుక"ను తెలుసుకోవాలనుకునేవాళ్లు గానీ, "ఎరుక" తనలోనికి ప్రవేశించాలి అనుకునేవాళ్లు గానీ తాము తమపై, తమ ప్రతిచర్యలపై, తమ ఆలోచనలపై, తమ ప్రతిస్పందనలపై, తమ అబద్ధపు ''స్వ''పై, తమ అబద్ధపు ''నేను''పై, తమ మనసులోని భావోద్వేగ అవక్షేపంపై ధ్యాస ఉంచాలి.

ఆధ్యాసలో తమ అబద్ధపు ''నేను'' గానీ తమ ఆలోచనలు గానీ జోక్యం చేసుకోకుండా అప్రమత్తంగా ఉండాలి.

ఇలా ఎన్నో సత్యాలను, సూచనలను, విషయాలను ఈవాక్యాలలో మనకు మహరాజ్ గారు ప్రసాదించారు.

కరోన మొదలగు సమస్యలతో మనసు కేంద్రీకరించ లేని స్థితిలోఉన్న నేను, శ్రీ సచిన్ క్షీరసాగర్ గారి సత్యనిష్ఠ, ధ్యానశక్తి వలననూ, శ్రీ నిసర్గదత్త మహారాజ్ గారి ప్రేమ, కరుణ, దయ చేతను, ఈ అనువాదమును పూర్తి చేయగలిగితిని. అందులకు వారికి నేను సర్వదా ఋణపడిఉన్నాను. ఈ నిష్కామకర్మ నాకు ఎంతో ఆనందమును ప్రసాదించినది.

ఈ వాక్యములను, జ్ఞానరత్నములను పారాయణం చేయువారు ''ఎరుక" సామ్రాజ్యం లోనికి ప్రవేశించే ద్వారానికి ''తాళంచెవి"ని పొందగలరు. వారికి అంధకారంలో సాగిపోవునపుడు, ''ఒక్క అడుగు" మేర జ్ఞానప్రకాశము, క్షణక్షణం తోడుగా నీడగా వెంట ఉంటుంది. అలా శ్రీ నిసర్గదత్త మహారాజ్ గారి ఆశీర్వాదములతో ''తాళంచెవి", ఆ''ఒక్క అడుగు" మేర జ్ఞానప్రకాశపు తోడు, అందరికీ, నాకూ లభించాలని ఆశతో ప్రార్థిస్తున్నాను.

పాఠకులను ఈగ్రంథమును పారాయణం చేయునప్పుడు వాక్యములపై కొంతసేపు విరామముతో ధ్యాసవుంచడం, ధ్యానించడం చేయమని ప్రార్థిస్తున్నాను.

కృతజ్ఞతలతో ప్రేమతో ఆనందంతో

బ్రాహ్మణపల్లి శ్రీధరబాబు

# ఎరుక

## శ్రీ నిసర్గదత్త మహరాజ్ ముఖ్యబోధామృతవాక్యములు

## స్వరూపము

1.సత్య స్వరూపం అన్నిటికంటే సులభమైనది. ఎందుకంటే అది తమ స్వరూపమే అయి ఉన్నది. స్వరూపం కంటే అన్యంగా మరే ఇతర ఆలోచన చేయకుండా ఉండటం, మరే ఇతర కోరిక లేకుండా ఉండటం చాలు.

2.మీ సొంతం కాని దానిని మీరు వదిలివేస్తారు. మీరు ఎన్నడూ పోగొట్టుకొనిదైన మీ నిజస్వరూపాన్ని మీరు పొందుతారు.

3.సత్య రూపాన్ని నిరూపించలేము మరియు దానిని ఖండించ లేము. మనసు లోపల మీరు ఎలా చేయలేరో మనసుకు ఆవల అలా చేయవలసిన అవసరం ఏమాత్రం లేదు.

4.నేనే అంతటా ఉన్నాను. నేనే అంతటా ఉన్న సత్యాన్ని. నా కంటే అన్యంగా అలాంటి ఏ సత్యమూ లేదు.

5.అబద్ధపు "నేను"ను త్యాగం చేయాలి. అప్పుడే స్వరూపం యొక్క అన్వేషణ పూర్తవుతుంది.

6.సంసారం అనేది ఏమీలేదు, మరియు "నేను" అనగా ఆత్మే అంతా.

7.అంతా శుద్ధ చైతన్యం లోనే ఉన్నది, శుద్ధ చైతన్యానికి ఎప్పటికీ మరణం లేదు, దానికి పునర్జన్మ కూడా లేదు. అదే ఆ మార్పు లేనట్టి సద్వస్తువు.

8.అన్ని నామ రూపాలను త్యజించిన తదుపరి సత్య స్వరూపము మీ చెంతనే ఉంటుంది.

9.తనను తాను తెలుసుకోవడానికి సహాయపడేదే – ధర్మము. ఆటంకాలు కల్పించేదే – అధర్మము. తన సత్య స్వరూపాన్ని తెలుసుకోవటమే పరమానందం మరియు సత్య స్వరూపాన్ని మరిచిపోవడమే దుఃఖము.

10.సత్యము ప్రేమమయము ప్రేమాస్పదము. అది అందరినీ కలుపుతుంది. అందరిని స్వీకరిస్తుంది. అందరినీ పవిత్రం చేస్తుంది.

11.ఒకసారి మీకు సత్య స్వరూపం యొక్క ఎరుక కలిగిందంటే అప్పుడిక దానిలో మీరు స్థిరంగా ఉండడం ఇష్టపడతారు.

12.ఎప్పుడైతే మీరు లోతుగా సత్య స్వరూపం యొక్క ఉపరితలం వరకూ లోతుగా దూకుతారో అప్పుడు మీ శరీరము, మరియు క్షుద్రంగా కల్పించుకున్న తన గురించిన ఊహ క్షణికమని, మరియు మీరు స్వయంగా అంతుతెలియని జీవన సాగరము అని మీరు తెలుసుకుంటారు.

13.ఎవరికైతే తన స్వరూప దర్శనం జరిగిందో, ‘‘స్వస్వరూప జ్ఞానమే పరమాప్తమైనది, అదే పరమాత్మ పరబ్రహ్మ పరమేశ్వరుడు” అని నమ్మకం కలిగిందో, అతను ఆ దేవదేవుడిని గుర్తించాడు.

14.మీరు ఉన్నారు, మీరు ఉండి యున్నారు, మరియు మీరు ఉండబోతారు ఈ అవగాహన సత్య స్వరూపము అనగా నిత్య స్వరూపానికి చెందినది. అది ఎప్పటికీ నష్టమయ్యేది కాదు.

## <u>జ్ఞానము</u>

15.నేను శరీరమును, ఇది మనసులో ఎప్పటికీ తీసుకురాకూడదు. నేను శరీరం లేదా మనస్సు అని మొదటి నుంచి కూడా అంగీకరించవద్దు.

16.కూడు, గుడ్డ, ఆధారం, కుటుంబం, మిత్రులు, కీర్తి, భద్రత ఇవన్నీ శరీరానికి సంబంధించిన సమస్యలు, మనం కేవలం శరీరం కాదు. ఇటువంటి జ్ఞానము మీకు వచ్చిన వెంటనే శరీరానికి సంబంధించిన సమస్యలు లేకుండాపోతాయి.

17.’’నేను ఉన్నాను’’ అనే భావన యొక్క లోతుకు వెళ్ళు, అప్పుడు శరీరం, హృదయం, మనస్సు, ఇంకా ఎన్నో అవన్నీ మీరే అని అర్థమవుతుంది. మీరు మిమ్మల్ని తెలుసుకుంటే మీకు అంతా తెలిసిపోతుంది.

18.బుద్ధి మరియు గత అభిప్రాయాల ప్రకారం జ్ఞానం తెలుసుకోవాలి అనుకుంటే, అలాంటి అవగాహన ఉన్నంతవరకు సత్య స్వరూపం యొక్క జ్ఞానం లభించదు.

19.అసత్యాన్ని వదిలేయండి, అప్పుడు ఇక సత్యం వెంటనే సహజంగా మీ లోపల ప్రకటమౌతుంది.

20.మీరేమిటో మీరు  కానిదేమిటో, ఇది తెలుసుకుంటే మీరు మిమ్మల్ని తెలుసుకుంటారు.

21.శుద్ధమైన "అస్తిత్వం"తోనే చేతన యొక్క జాగృతి కలుగుతుంది. చేతన లోనే ప్రపంచం పుడుతున్నది మరియు చేతన లోనే లయం అవుతున్నది.

22.సుఖం కోసం చేసే ప్రయత్నమే దుఃఖానికి కారణం అవుతున్నది.

23. నామరూపాలు ఇందులో లేవు, కేవలం ఆవరణం మాత్రమే ఉన్నది, ఇంకా సత్యము  నామ రూపాలకు అన్యమైన శుద్ధ జీవన శక్తి మరియు చేతన యొక్క ప్రకాశం, అని ఎప్పుడు మీరు తెలుసుకుంటారో, అప్పుడే మీకు శాంతి లభిస్తుంది. అప్పుడే మీరు  సత్య స్వరూపం యొక్కగంభీరమైన మౌనంలో నిమగ్నమై పోతారు.

24.మీరు సర్వవ్యాప్తమైన, శాశ్వతమైన అపరిమితమైన సృజనశీలమైన ఆ శుద్ధచైతన్యమే.

25. చేతన యొక్క ప్రకాశం సంపూర్తిగా వ్యాప్తి చెందిన తర్వాత, దాని యొక్క మూలం స్వయంగా ప్రకటమవుతుంది.

26.వ్యక్తి అంటే మనిషి యొక్క మనసు తెర మీద పడినటువంటి కేవలనీడ లేదా ప్రతిబింబము మాత్రమే.

27. వాస్తవంగా కేవలం శుద్ధ చైతన్యమే ఉన్నది. జీవితం మొత్తం చేతనయే, అంతా చేతన వలననే జీవంతో ఉన్నది.

28.''నేను కేవలం సాక్షిని". ఈ పరిశీలన శరీరం-మనస్సును శుద్ధి చేసి జ్ఞాన నేత్రాన్ని తెరుస్తుంది. తదుపరి సాధకుడు భ్రమకు అతీతంగా వెళతాడు మరియు అతడి హృదయం అన్ని కోరికలనుండి విముక్తం అవుతుంది.

29.''నేను ఉన్నాను" అనే భావన మీద, ''తన అస్తిత్వం" యొక్క భావన మీద మనస్సును కేంద్రీకరణ చేయడం ద్వారా ''నేను ఫలానా వ్యక్తిని" అనేది లయమైపోతుంది. ఇంక ''నేను కేవలం సాక్షిని" అనేది మాత్రమే మిగిలి ఉంటుంది. అది కూడా ''నేనే అంతా" అనే భావనలో విలీనమై అంతా ఒకటై పోతుంది.

30.తనను అందరిలో చూడటం మరియు అందరినీ తనలో నిశ్చయంగా చూడటం - ఇదే ప్రేమ.

31.ప్రపంచం చేతన యొక్క సూత్రం మీద ఆధారపడి ఉన్నది. దీనిని బాగా ధ్యానం లోకి తీసుకోవాలి. చేతన లేకపోతే ప్రపంచం లేదు.

32.చేతన మరియు అచేతన, ఒకే జీవితం యొక్క రెండు పక్షాలు.

33.మీకంటే అన్యముగా ప్రపంచానికి అస్తిత్వము లేదు. ప్రతి క్షణం అది మీ యొక్క కేవలప్రతిబింబమే అయిఉన్నది. మీరే దాని నిర్మాణం చేస్తున్నారు మరియు మీరే నష్టపరుస్తున్నారు.

34.ప్రపంచాన్ని మార్చాల్సిన అవసరం లేదు, మీ యొక్క దృష్టి కోణాన్ని సరిచేసుకోవాలి.

35.ఈశ్వరుడు కేవలం సత్యం-శివం మాత్రమే కాదు, ఆయన సుందరం కూడా. సౌందర్యం యొక్క ఆనందం కోసం సౌందర్యాన్ని సృష్టించాడు. ఏదైతే ఆనందంతో చూడబడుతుందో... అదే సుందరం. ఆనందం ఈ సౌందర్యం యొక్క స్వరూపం.

36.దేని కోసమయితే మీచేత ప్రయత్నం మరియు శ్రమ చేయబడుతుందో మీరు ఆ సుఖానికి ఎంత విలువ కడతారు? నిజమైన ఆనందం సహజంగా ప్రయత్నరహితంగా ఉంటుంది.

37. విశ్వము కంటే ముందే చేతన ఉండేది. చేతనలోనే అది అస్తిత్వం లోనికి వస్తుంది, చేతన లోనే అది ఉంటుంది మరియు శుద్ధ చేతనలోనే విలీనమై పోతుంది. అంతటికీ మూలం ''నేను", ఇది చేతనయే. ''ప్రపంచము ఉన్నది" ఈ మానసికఅవస్థ హీనమైన స్థితి, ఎందుకంటే నా అస్తిత్వానికి ప్రపంచం యొక్క అవసరం లేదు, కానీ ఈ విశ్వానికి నా అవసరం ఉంది

38.అన్వేషణతో కూడిన పూర్తి అవగాహనతో శుద్ధ చేతనతో జీవితం జీవించడం, ఇదే నిసర్గ యోగము.

39.సత్యం యొక్క ఏకైక కిరణం అసత్య పర్వతాన్ని భస్మం చేసేస్తుంది.

40.జ్ఞానానికి అతీతమైన అనుభవం లాంటిది ఏమీ లేదు, అనుభవం ద్వంద్వావస్థ.  మీరు స్వరూపం గురించి అనుభవంతో మాట్లాడలేరు.

41.ప్రతి ఒక్క క్షణం, గతానికి సంబంధించినదంతా అవగాహన చేసుకుంటుంది, భవిష్యత్తుకు సంబంధించినదంతా నిర్మిస్తుంది.

42.ఒకవేళ మీరు మిమ్మల్ని ప్రపంచానికంటే వేరుగా అర్థం చేసుకుంటే, అప్పుడు ప్రపంచం మీకంటే వేరుగా కనిపిస్తుంది. ఇక మీకు భయం, కోరికల అనుభవాలు కలుగుతాయి. ప్రపంచం నాకంటే అన్యము, అని అలా నేను చూడటం లేదు అంచేత నా దృష్టిలో ఇష్టపడటం లేక భయపడటం వంటివి ఏ మాత్రం లేవు.

43.మీ జీవితంలో అన్నిటికంటే మహత్వపూర్ణ మైనది స్వయంగా మీరే. స్వీయతత్త్వంపై తిరుగులేని సావధానత పెట్టండి. మీ వ్యక్తిగత జీవితం యొక్క కేంద్రం మీరే. కేంద్రాన్ని తెలుసుకోవడానికి బదులుగా, మీరు ఇంకేమి తెలుసుకుంటారు?

44.అజ్ఞానాన్ని గుర్తించటమే జ్ఞానము. దానికి అతీతంగా ఏదైతే ఉందో దానిని వ్యక్తం చేయడం సాధ్యం కాదు.

45. అనుభవించేవాడు మరియు అనుభవం, ఈ రెండింటి యొక్క మూలం “నేనే” .  అంచేత ‘‘నేను”ను ఎప్పటికీ మరిచిపోరాదు - ఇదే జ్ఞానము.

46. ‘‘నేనెవరు?” దీనిని నేను చెప్పలేను, ఎందుకంటే నేను కాని దానినే పదాలు వర్ణించ గలుగుతాయి.

47. నాకు శరీరము ఉంది, ఈ కల్పన అంటే పుట్టుక, మరియు నేను నా శరీరం పోగొట్టుకున్నాను. ఇలాంటి కల్పనే మరణం.

48. శరీరానికి అన్యంగా సత్యస్వరూపమే, ‘‘నేను” అనే సంవేదన రూపంలో శుద్ధ ఎరుకగా ఉంది.

49. ‘‘నేను” అంటే స్వయం యొక్క సమగ్రమైన అస్తిత్వము, చేతన యొక్క సముద్రము, సంపూర్ణమైన సత్తు-చిత్తు యొక్క సమగ్ర విశ్వం. నా దృష్టిలో ఇష్టపడటం వంటిది ఏమీ లేదు, ఎందుకంటే నేను ఎప్పటికీ పరిపూర్ణమై ఉన్నాను.

50. సుఖము-దుఃఖము రెండూ ఒకటే, ఇది తెలుసుకోవడమే ఆనందం.

51.సుఖము మరియు దుఃఖము, ఇది ఆనందసాగరం యొక్క అలల ఎత్తు మరియు లోతు లాంటిది. అత్యంత లోతులో పూర్తిగా సంపూర్ణత వుంది.

52. సుఖము మరియు దుఃఖము, జీవితం-మరణం, ఇదంతా బద్ధజీవుడికి సత్యం అనిపిస్తుంది. నా దృష్టిలో కనిపించేదంతా సత్యమనేది అసత్యము. .

53. ఆత్మజ్ఞాని వర్ణించిన సత్యము ఒక్కసారి వింటే, అది ఎప్పటికీ మర్చిపోబడదు. నేలపై నాటిన విత్తనము వలె అది సరైన వాతావరణం కోసం ఎదురు చూస్తుంది, మొలకెత్తుతుంది మరియు అదిమహావృక్షంగా తయారవుతుంది.

54.ప్రేమ మరియు దయ, ఇది జ్ఞానుల యొక్క స్వభావం. అది అన్ని ప్రాణుల విషయంలో ఒకే విధంగా ఉంటుంది. వ్యవహారము సమరూపంగా ఉండటమే ప్రేమ.

55.జ్ఞాని మీకు దృఢ విశ్వాసం ఇవ్వలేడు. అది మీ యొక్క స్వానుభవం చేతనే ఏర్పడటం జరగాలి.

56.చేతన స్వయంగా ప్రకాశించ లేదు, చేతన కంటే అతీతంగా ఏ ప్రకాశం అయితే ఉందో ఆ ప్రకాశం చేత అది ప్రకాశిస్తున్నది.

57."నేను ఉన్నాను" అనే ఈ అనుభవం మనో నిర్మిత ప్రపంచం లోనిది, కానీ ఈ ప్రపంచానికి అతీతంగా వెళ్లే ద్వారం తెరవడానికి అదే తాళంచెవి.

58.ఏవిధంగా సూర్యునికి అంధకారం తెలియదో, అదేవిధంగా ఆత్మకు అనాత్మ తెలియదు.

59. మొట్టమొదట స్వయమే సాక్షి, అంటే ఆకారరహితమైన కాలరహితమైన నిరీక్షణ కేంద్రము. ఈ విధంగా తెలుసుకోవాలి. అది మనస్సు మరియు పదార్థం అయినప్పటికీ, ఈ రెండింటికీ అతీతంగా ఉండే ఆ శుద్ధ చైతన్య మహాసముద్రాన్ని తెలుసుకోవాలి.

60.వాస్తవంగా అంతా నా లోనే మరియు నా వల్లనే అయి ఉన్నది. ఇతరం ఏమీ లేదు. ఇతరం ఉన్నది అనే కల్పనయే అనర్థము మరియు మహాసంకటము.

61.మీరు గతము లేని భవిష్యత్తు లేని క్షణికము, అలా భావన చేయటం వలన మీ వ్యక్తిత్వము విచ్ఛిన్నం కావడం మొదలవుతుంది.

62.''నేను ఉన్నాను" ఇది నిరంతరము ఎల్లప్పుడూ తాజాగా ఉంటుంది. అది అవడానికి మీరు గుర్తు చేసుకోవాల్సిన అవసరం లేదు.

63.లక్షలమంది రొట్టె తింటారు, కానీ ఎంత తక్కువ మందికి గోధుమల గురించి పూర్తి వివరం తెలిసి ఉంటుంది? ఎవరికైతే వివరం తెలిసి ఉంటుందో వారే రోటీని తయారు చేయగలరు. అదేవిధంగా ఎవరైతే స్వస్వరూపాన్ని తెలుసుకొని ఉన్నారో, మరియు జగత్తుకు అతీతంగా చూసి ఉన్నారో, వారే ప్రపంచాన్ని బాగుచేయగలరు.

64.మీరు సృష్టిలో లేరు. సృష్టి అంతా మీలోనే ఉన్నదని, ఒక్కసారి మీరు సందేహం లేకుండా తెలుసుకుంటే ఇక మీరు సృష్టికి అతీతంగావుంటారు. అంటే మీ శరీరం సృష్టిలో మరియు సృష్టిదిగా ఉంటుంది. కానీ మీరు దానిలో చిక్కుకోరు.

65.శరీరం మరియు మనసు కంటే వేరుగా స్వతంత్రంగా ''నేను" యొక్క అస్తిత్వం ఉంది - ఇలా ప్రత్యక్ష అనుభవం ఉంటుంది. అది సత్-చిత్-ఆనందమై ఉన్నది. తానైఉన్న శుద్ధ అనుభవం, ఇదే ఆనందము.

66.మీకు సుఖంగా ఉండాలని కోరిక ఉందా ఏమిటి? ఎందుకంటే మీకు మీ "నేను" మీద ప్రేమ ఉంటుంది. కానీ మీ కోర్కెలు మూర్ఖమైనవిగా గానీ లేక తెలివైనవిగా గానీ ఉండవచ్చు? ''నేను"ను ప్రేమించు కానీ అవగాహనతో ప్రేమించు.

67."తన అస్తిత్వం"లో ఆనందం, ఇది స్వయం-ప్రేమ యొక్క అన్నిరూపాలలోకి సామాన్య సరళ రూపము.

68.మీరు శరీరము, ఈ అవగాహనను ఆపేయండి, అలాచేస్తే జీవితం-మరణం అనే ఈ సమస్య అర్థంలేనిదైపోతుంది. పరిమితమనే అవగాహన లేకుండా పోతే భయము, దుఃఖము, మరియు సుఖము యొక్క అన్వేషణ, ఈ మాటలన్నీ ఆగిపోతాయి. కేవలం తన యొక్క పరమానందరూప అస్తిత్వం యొక్క శుద్ధ బోధ మిగిలి ఉండిపోతుంది.

69.శరీరము ఉంది మరియు ఆత్మ ఉంది, వీటిమధ్య మనసు ఉన్నది, దానిలో ఆత్మ ''నేను" అనే చేతన తో ప్రతిబింబితమవుతున్నది.

70. మనసు – అసంపూర్ణమైనది, పచ్చిది, అనారోగ్యవంతమైనది, సూక్ష్మదృష్టి లేనిది, పూర్ణ జ్ఞానము లేనిది అవటం వలన అది తనను శరీరం అనుకుంటున్నది, ఆత్మ అని అనుకోదు, మనసు తన ఆత్మతో ఉండే సమతాతత్త్వాన్ని తెలుసుకోగలదు. దీనికోసం మనస్సును శుద్ధి చేయవలసిన అవసరం ఉంది.

71.మనస్సు ఎప్పుడైతే ఆత్మలో విలీనం అవుతుందో అప్పుడు శరీరం యొక్క సమస్య సమాప్తం అయిపోతుంది.

72. నిశ్చలత మరియు మౌనము యొక్క అర్థము నిష్క్రియత అనుకోవద్దు.

73."నేను ఉన్నాను" ఈ బోధ మీ ఆత్మది, దీని నుండి మీరు వేరుకాలేరు, కానీ నేను యువకుడిని, ధనవంతుడిని, మొదలైనవాటిని మీరు దానిలో కొంచెం జోడించగలరు. ఈ విధమైన తాదాత్మ్యం తో నిండిన భ్రమ ఉండటం బంధానికి కారణం అవుతున్నది.

## అజ్ఞానము

74.అసద్భక్తి, అసద్భావం, దేహస్మరణచే ఏ ఆచరణ చేయబడుతుందో అది అసత్య-ఆచరణ, సదాచరణ కానిది, దురాచరణ.

75. జగత్తును సత్యమని మరియు ఆత్మను  అసత్యమని అర్థం చేసుకోవటం అజ్ఞానము. ఇదే దుఃఖానికి కారణము.

76. దృశ్యం సత్యము అని అనుకోవడం భయానకమైన పాపము.  మరియు అదంతా అభ్యంతరాల కారణము చేతనే.

77. మీకు ప్రపంచం గురించి అంతా తెలుసు, కానీ మీ గురించి కొంచెం కూడా తెలియదు.

78.తమ పుట్టుక జరిగింది అనే ఈ మీ విశ్వాసము తప్పు. మీకు ఎప్పుడూ  పుట్టుక జరగలేదు, మీరు ఎప్పటికీ మరణించేవారు కాదు.

79. మీకంటే అన్యంగా ఉన్న ప్రతి ఒక్క మాట యొక్క అస్తిత్వాన్ని నమ్మవద్దు. కోరికల కారణంగా మీరు సుఖదుఃఖాల ప్రపంచాన్ని నిర్మించారు.

80.కోరికల యొక్క స్వభావం ఎలా ఉంటుందంటే, అది తనను పూర్తి చేసుకొనుటకు, ప్రపంచాన్ని నిర్మించడానికి మనసును ప్రేరేపిస్తుంది.

81.కోరిక మరియు భయం వీటిలో ఏర్పడినటువంటి అనుభవం  అశుద్ధ మైనది. మరియు అది కర్మను నిర్మిస్తుంది.

82.''నేను ఫలానా వ్యక్తిని" ఈ విధమైన అవగాహనతో ఉండేవాడు, చెడు అలవాట్లతో ఉన్న మనసూ కష్టానికి ఆందోళన చెందును. లాభం పొందాలని కోరుకుంటాడు మరియు  లాభము రానప్పుడు దుఃఖాన్ని అనుభవిస్తాడు.

83.ప్రేమ కానిదంతా పాపము, ప్రేమ లేనటువంటి జీవితము కూడా పాపమే.

84.''నేను శరీరమును." ఈ కల్పనతో గుడ్డిదైన మనసు నిరంతరంగా భ్రమ దారాన్ని అల్లుకుంటూ వెళుతుంది.

85.తెలుసుకోకపోవడం, తెలుసుకోలేదనేది కూడా తెలియకపోవడం, అంతము లేనట్టి దుఃఖానికి కారణం.

86.ఆసక్తియే బంధనము, ఉదాసీనతయే స్వేచ్ఛ. కోరడం అంటే బానిసతనమే.

87.తనను మరచిపోవటం, ఇదే అన్నిటికంటే పెద్ద హాని. దీనితో అన్ని ఆటంకాలనిర్మాణము జరుగుతున్నది.

88.సుఖాన్ని పొందడం కొరకు ఎవరిమీదైనా ఆధారపడటం - ఇదే పెద్ద దుఃఖం.

89. శరీరం లేదా మనస్సు మరియు వాటితో కలిసి ఉండే వారు మీకు అవసరమైన స్వరూప జ్ఞానాన్ని పరమశాంతిని మీకు ఇవ్వలేరు.

90.ఆత్మను 'ఫలాన అది', 'ఫలాన ఇది' అని అర్థం చేసుకొని పరిమితం చేయటం ద్వారా మీ అన్ని ప్రశ్నలు పుడుతున్నాయి.

91. మిమ్మల్ని మీరు ఎంత ప్రేమిస్తారో అదేవిధంగా ఇతరులను ప్రేమించే నాటకం ఆడవద్దు. మీరు ఇతరులను ఎంతవరకు ఆత్మస్వరూపంగా అర్థం చేసుకోరో అంతవరకు వారిని మీరు ప్రేమించలేరు.

92.మీరు ప్రపంచంలో శాంతి మరియు మంచివిచారణ కోరతారు, కానీ మీలోపల శాంతి మరియు మంచివిచారణ కోరరు.

93.శరీరం యొక్క అర్థం మీరు ఆకారంలో ఉండడం, మనస్సు యొక్క అర్థం మీరు కాలం లో ఉండడం. కానీ ఏమిటీ మీరు మనోశరీరమా? ఏమిటి మీరెప్పుడైనా దీని గురించి అన్వేషించారా?

94.నిజానికి మీరు ఏది కాదో, దానిలా అయిపోయి ఉండటం ఇది మీ అంతట మీరే సొంతంచేసుకున్నారు. మీరు ఎలా కారో అలా మీరు ఎందుకు ఉన్నారు? దీనికై అన్వేషించడం, ఈ పరుగు వ్యర్థం.

## సద్గురు

95. మనల్ని మన అస్తిత్వంగా ఉండమని బోధ చేసేవారు ఆత్మజ్ఞాని.  ఆ ఆత్మజ్ఞానిని ఆత్మప్రకాశకుడు, విశ్వప్రకాశకుడు, భక్తిప్రకాశకుడు, చైతన్యప్రకాశకుడు, బుద్ధిప్రకాశకుడు, సద్గురుడుగా భావించి నమస్కరించాలి, ప్రణామం చేయాలి.

96.మీ ఆత్మయే మీ సద్గురుడు. బాహ్యగురువు లోపలి దాని నీడ మాత్రమే. మీ అంతఃకరణయొక్క గురువే మీ లక్ష్యం వైపుకు తీసుకవెళతాడు, ఎందుకంటే అతడే మీ లక్ష్యము.

97. మీయొక్క అంతరాత్మయే సర్వ శ్రేష్ట గురువు. నిజమైన సద్గురువు అతడే. అతడే మిమ్మల్ని లక్ష్యం వరకు తీసుక వెళ్ళగలడు. మరియు అతడే మీకు మార్గము చివరలో లభిస్తాడు. అతడిపై విశ్వాసము ఉంచండి. ఇంక మీకు ఏ ఇతర గురువు యొక్క అవసరం లేదు.

98.ఎవరైతే దృశ్యముల మోహానికి అతీతమైన సత్యాన్ని తెలుసుకుంటారో, వారే నిజమైన గురువు.

99.మీ యొక్క ప్రస్తుత స్థితిని మరియు మీరు కాబోయే సత్యాన్ని ఎవరు తెలుసుకుంటారో వారే మీ గురువు.

100. సద్గురువు యొక్క కృప ఎల్లప్పుడూ  ఉంటుంది మరియు అది అందరికీ సమానంగా ఉంటుంది.

101. సద్గురువును కలవాలని తపన మొదలైంది, దీని అర్థం - సద్గురువే వచ్చి జ్యోతిని వెలిగించారు, ఒక సాదాసీదా శబ్దము లేదా ఒక పుస్తకములోని ఒకపేరా కూడా ఈ పని చేయగలదు. సద్గురువు కృప అదృశ్యరూపంలో పనిచేస్తుంది.

102.మన హృదయం అత్యంత లోతులలో కాలాతీతమైన జ్యోతి, శాంతి రూపంలో వెలుగుతున్నది, అదే నిజమైన గురువు, మిగతా గురువులందరు కేవలం మార్గదర్శనం చేస్తారు.

103.అంతరగురువు యొక్క బాహ్యాఆకారమే బాహ్యగురువు. అంతరగురువు బాహ్యగురువును కొంచెంసమయం వరకు స్వీకరిస్తుంది.

104.బాహ్యగురువు మార్గదర్శనం చేస్తారు, ఇక అంతరగురువు శక్తిప్రదానం చేస్తారు. దానిని నేర్పుతో పాటించడమే - ఇదే శిష్యుని పని.
105.

## సాధకుడు - సాధన

106. ‘‘నేను శరీరమును”, ‘‘నేను మనుష్యుడను”, ‘‘నేను స్త్రీని”, ‘‘నేను అది”, ‘‘నేను ఇది” అనుకుంటూ అలా మనసుతో తాదాత్మ్యం కాకుండా చూడాలి. అలా మనసు అవుతుంటే, దానిని మనసు లేకుండా చేయండి. మరియు నేను జ్ఞానమయుడను, జ్ఞానస్వరూపుడను, ప్రకాశరూపుడను, చైతన్యరూపుడను అంచేత నిరాకారుడను - ఈస్మరణలోకి తీసుకరండి.

107.ఒకవేళ మిమ్మల్ని సద్గురువు స్వరూపం ప్రేమించాలంటే, మీరు అతని గురించి భక్తి చేయాలి, సంసారంతో గొడవ, ఫిర్యాదు చేయవద్దు.

108.ఎవరికైతే సత్యానికై దాహార్తి ఉంటుందో వాడే సత్ శిష్యుడు. ఎవడైతే భక్తిచేస్తూ అసత్యాన్ని కోరతాడో, అతడు సత్ శిష్యుడు కాదు. సత్ శిష్యునికి ఉచ్చకోటి స్వరూపజ్ఞానము ప్రాప్తిస్తుంది.

109.సద్గురువు అనే శబ్దం ఏమిటో అదే మనం, దాని అర్థమే మనం. మీకు ఏ శబ్దం ఇవ్వబడిందో అదే మీరు, అలాంటి ఖచ్చితమైన నిశ్చయంతో ఉండండి.

110.లక్ష్యంపై ఏకాగ్రత మరియు అధ్యయనంలో నిజాయితీ కారణంగా మీరు లక్ష్యాన్ని చేరుకుంటారు.

111.ధ్యానము యొక్క అంతిమ లక్ష్యము జీవితం మరియు చేతన యొక్క మూలం వైపు వెళ్లడం.

112. ధ్యానము సాత్విక క్రియ అవడం చేత రాజసిక మరియు తామసిక గుణములను పూర్తిగా దూరం చేయడమే ధ్యానము యొక్క ఉద్దేశ్యము.

113. సంచరించడం మనస్సు యొక్క స్వభావము, చేతన యొక్క కేంద్రబిందువును మనసుకు అతీతంగా తీసుకపోవడమే, ఇంతే మీరు చేయగలరు.

114.సుఖము ఆత్మచేత ప్రకటము అవుతుంది, మరియు ఆత్మలోనే లభిస్తుంది. మీరు స్వరూపమును అన్వేషించండి, ఇక మిగిలినదంతా దాని వెంటనే వచ్చేస్తుంది.

115.ఎవరైతే శాంతిని నష్టపరచరో, వారే శాంతికి అర్హులవుతారు.

116.మనసును నిర్దోషం మరియు హృదయాన్ని నిర్మలం చేయుటకు ప్రయత్నం చేయండి. శాంతి గా మరియు అప్రమత్తంగా ఉంటూ, తమ స్వరూపాన్ని అన్వేషణ చేయడం మీకు చాలు. ఇదే శాంతికి ఉన్న ఏకైక మార్గము.

117.మీరు, ఆత్మ మీద, ప్రత్యేకంగా మనసు మీద ప్రతిక్షణం, సంకోచంలేకుండా అప్రమత్తంగా ఎరుక ఉంచాలి. ఆత్మను అనాత్మనుండి వేరుచేయుటకు ఈసాక్షీభావం యొక్క అవసరం ఉంది.

118.అంతర్ముఖులై ఏది మీరు కాదో, దానిని అన్వేషించండి.

119. లక్ష్యం పై ప్రేమ ఉండుట కారణంగా మీరు నిర్మలంగా మరియు బాగా నిర్వహణయుతంగా జీవిస్తారు.

120.మీరు మీ మనసును దూరంగా ఉంచండి, దానితో సంగత్వం లేకుండా ఉండండి. మీ శరీరం లేక మనస్సుచేత మీకు ఏదైనా కొంచెం లభించటం అంటూ ఏమీలేదు.

121.జీవితం సమర్పించుటకు ఎవరు సంసిద్ధులై ఉంటారో, వారికే సత్యము లభిస్తుంది.

122.''నేను ఉన్నాను" కేవలం ఈచేతన స్మరణను ఉంచండి. మీ మనస్సు మరియు భావన ఒకటే అయ్యేంతవరకూ దానిలోకి చేరిపోండి.

123.మీకు మీ శరీరం గురించి ఏ దృష్టికోణం వుందో దానిని సరి చేయండి! మరియు శరీరం ఎలా ఉంటే అలా ఉండనివ్వండి. దానిని అతిగారాబం చేయకండి! కష్ట పెట్టకండి!

124.ఉన్నతమైన దానిని కోరండి. సర్వోచ్చసుఖము, సర్వశ్రేష్ఠ స్వతంత్రత, ఏఇష్టం లేకుండుట ఇదే ఉన్నతమైన సుఖము.

125.అందరికీ మంచి జరగాలి, ఈ ఆలోచన ఉంచండి అప్పుడు విశ్వమంతా మీతోకలిసి పనిచేస్తుంది.

126.''నేను ఉన్నాను" ఈ చేతనను మనసులో దృఢంగా కేంద్రీకరించండి. మీకు అన్నివిధాలైన అనుభవాలు వస్తాయి. కానీ ఈ అనుభవంతో పాటు అన్ని అనుభవాలు క్షణికమని నిశ్చలంగా ఉండండి, మరియు కేవలం ''నేను ఉన్నాను"తో తగులుకొని ఉండండి.

127.మీ బంధాలను అన్వేషించుటకు, వాటిని శక్తిహీనం చేయుటకు, బంధనపాశాలను విసరివేయుటకు ధ్యానం మీకు మద్దతునిస్తుంది. మీరు ఎప్పుడైతే అన్నింటినుంచి అనాసక్తులవుతారో అప్పుడు మీ కార్యభారము సమాప్తమవుతుంది.

128. ఏమిటీ మీరు పుట్టుక సమయంలో ఉండి ఉన్నారా? అయితే మృత్యుసమయంలో మీరు ఉండరా ఏమి? ఏదైతే ఎప్పుడూ ఉంటుందో దానిని అన్వేషించండి.

129.మాటల క్షేత్రంలో అంతా సాపేక్షంగా ఉంటుంది. నిరపేక్షమైన సత్యాన్ని అనుభవించగలుగుతాము, దానిచర్చ చేయలేము.
130.తెలుసుకునేవాడిని తెలుసుకో దానితో అంతా తెలియబడుతుంది.

131.ఏదైనా, ఏవరైనా మీకు ముక్తిని ఇవ్వలేరు ఎందుకంటే, మీరు మొదటినుంచి విముక్తులైఉన్నారు. తమను తాము ఏకోరికాలేకుండా స్పష్టంగా చూడండి, ఇది చాలు.

132.నిత్యసత్యాన్ని చూడాలనుకుంటే తమలోపల చూడండి. తమ యొక్క లోలోతులలో మునిగి వుండండి మరియు మీలో ఏసత్యమున్నదో ఆసత్యాన్ని అన్వేషించండి.

133.''నేను ఎవరు" ఈ ప్రశ్నకు అన్యంగా ఉన్న అన్నిప్రశ్నలను వదిలేయండి. చివరలో ''మీరు ఉన్నారు'' ఈస్థితిపై మీకు విశ్వాసము వచ్చేస్తుంది. ''నేను ఉన్నాను" ఇది నిశ్చితమైనది, ''నేను ఫలానా" ఇది నిశ్చితము కాదు. వాస్తవంగా మీరు ఏమిటి, ఇది కనుగొనుటకు ప్రయత్నించండి.

134.మీరు శరీరంగానీ, మనసు గానీ కాకుండా, ఆత్మకు తనపైన ఉండే ఆత్మప్రేమయే మీరు అని, మీకు 'అన్వేషణ చేయడం' ద్వారా తెలిసివస్తుంది. మీచేతన మరియు నాచేతన చూడటానికి రెండు. కానీ ఒకటే. ఐక్యతను సాధించండి, అదే ఆత్మ ప్రేమ.

135. మీకిప్పుడు దేని మీద ప్రేమ ఉంది? ''నేను ఉన్నాను"అనే చేతన మీదనా. మీ హృదయాన్ని మనస్సును దానికి సమర్పించండి. ఇతరమైన ఏమాట గురించి విచారణ చేయవద్దు, ఇది ప్రయత్నం లేకుండా సహజమవ్వటమే సర్వోచ్చస్థితి. దానిలో ప్రేమయే ప్రియుడు మరియు ప్రియురాలు.

136.మీకు జననము అయింది. మీకు అమ్మ-నాన్న ఉన్నారు. శరీరం ఉన్నది, మీకు మరణం వస్తుంది, ఇటువంటి అన్ని ఊహలను వదిలెయ్యండి. మొదలయితే పెట్టండి. మీకు ఎంత కఠినం అనిపిస్తున్నదో, అది అంత కఠినం కాదు.

137.చేతనరహితసాధన చాలా పరిణామకారకము అవుతున్నది, ఎందుకంటే అది స్వయంప్రకాశంగానూ మరియు స్థిరంగానూ ఉంటుంది.

138.ఎవరైనా సాధువు మీకు మంత్రం ఇచ్చారు మరియు మీరు శ్రద్ధతో, భక్తితో దానిని జపము చేసినట్లయితే మీ దురదృష్టం తప్పక మారిపోతుంది. దృఢమైన శ్రద్ధ అదృష్టం కంటే గొప్పదైనది. స్థిరకృతజ్ఞత, విశ్వాసం, శుభాకాంక్షలు అదృష్టం మీద సహజముగానే విజయప్రాప్తి పొందగలవు.

139.మీరు అన్నింటినుండి విముక్తిచెందినట్టి శుద్ధ చేతన అయినంతవరకు మీరు సాధకులే! ఈ ఆలోచనను పట్టుకుని ఉండటం మంచిది. చేతనకు అతీతంగా వెళ్లడమే స్వరూప స్థితి.

140.పనియే అంకితభావానికి సాక్ష్యము. మీకు చెప్పబడిన దానిని సావధానంగా చేయండి. అప్పుడు అన్నిసమస్యలు దూరంగా పోతాయి.

141.సుఖము గురించిన కోరిక వదిలేయండి, ఇక దుఃఖము ఎక్కడ? మీకు దాని గురించిన జాడ కూడా లేకుండా పోతుంది.

142.ఈ ప్రపంచం కోరిక మరియు భయాల యొక్క అవకాశక్షేత్రము. దీనిలో మీకు శాంతి లభించజాలదు. శాంతికోసం మీరు ప్రపంచానికి అతీతంగా వెళ్లాల్సిఉంటుంది.

143.పూర్తి ధ్యాసతో అనాసక్తులవ్వండి, దాని నుంచి అంతా వచ్చేస్తుంది.

144.సాధకుడు ఎంత అభివృద్ధి చెందినప్పటికీ, అతనికి నమ్రత మరియు మౌనము అవసరము.

145.యోగి పదునైన బాణమువలె ఉంటాడు అతడు. దానితో అతడు కోసుకుంటూ నేరుగా లోతువరకు చేరగలడు, మిథ్య యొక్క అనేక ఆవరణాలను కోసుకుని లోతువరకు చేరడంకోసం అతనికి అలా ఉండవలసి ఉంటుంది. భోగి అనేకులను భజిస్తూ ఉంటాడు అయితే యోగి కేవలం స్వరూపంయొక్క సేవచేస్తాడు.

146.సత్సంగం మానసిక మరియు శారీరక వ్యాధులకు శ్రేష్ఠమైన ఉపచారము.

147.ఎలాగైతే ఏదైనా తక్కువఅవటంచేత వచ్చే రోగము ఆతక్కువను పూరించగానే నయమైపోతుంది. అదేవిధంగా జీవితాన్ని జీవించే రోగము, వివేకము-వైరాగ్యము నిండుగాఉంటే చక్కబడిపోతుంది.

148.సుఖము మరియు దుఃఖము, కోరిక మరియు భయం వీటి పుట్టుక వైపు గా వెళ్ళండి, నిరీక్షణ చేయండి, అన్వేషించండి, అవగాహన చేసుకొనుటకు ప్రయత్నించండి.

149.చింతన చేయండి, జిజ్ఞాస ఉంచండి, విచారణచేయండి, మార్గాన్ని వెతుకుటకు అంకితభావాన్ని చూపండి.

150.మీ యొక్క అస్తిత్వం మీద ధ్యానం ఉంచండి. మీయొక్క మనస్సుమీద దృష్టి ఉంచండి. దానిమీద పూర్తిగా ధ్యానం చేయండి.

151.భయము మరియు పేరాశలచే బుద్ధియొక్క దురుపయోగము అవుతున్నది. ప్రేమ, జీవనము, సత్యము, సౌందర్యంలయొక్క సేవాభావములో బుద్ధియొక్క సరైన ఉపయోగం ఉంటుంది.

152.మీమనసును నిర్మలం చేయండి, హృదయాన్ని శుద్ధిచేయండి. జీవితాన్ని పవిత్రంచేయండి. ఇదే సంసారాన్ని మార్చే సన్నిహితమార్గము.

153.సాధనకు సంబంధించిన మీ శ్రద్ధ ఎంత స్థిరంగా మరియు లోతుగా ఉంది ఇదే మహత్వపూర్ణ మైనది. జీవితమే సద్గురువు. దానిద్వారా వచ్చినట్టి పాఠంపై ధ్యానం ఉంచండి మరియు దాని ఆజ్ఞలను పాలించండి.

154.సత్సంగంలో ఉండటం అంటే విశ్వాసం ఉంచటం మరియు ఆదేశాలను పాలించడం, గురువుయొక్క ఉపదేశాన్ని వ్యర్థంకానీయకుండా, మీ గురువును ఎల్లప్పుడూ హృదయంలో స్థాపించుకునిఉండటం, మరియు ఆయన ఉపదేశాలను స్మరణచేయడం ఇదే నిజమైన సత్సంగం.

155.మనం శుద్ధమయ్యే స్మరణ, స్వయంగా ప్రయత్నపూర్వకంగా చేయడమే సాధన.

156.క్షణికంలో శాశ్వతం ఏమిటి? అసత్యంలో సత్యం ఏమిటి? దీనిని అన్వేషించడం - ఇదే సాధన.

157.కోరిక మరియు భయం వీటిఅనుభవాలకు వెనుక ఏముందో, దాని మీద పూర్తి ధ్యానం పెట్టండి. తమకుతాము ప్రశ్నించుకోండి. ఎవరు కోరుకుంటున్నారు. కోరేవాడిమీద ధ్యానం ఉంచండి. ప్రతిఒక్క కోరిక ద్వారా మీరు మీస్వరూపానికి సమీపంగా రావాలి.

158.ఏదైతే జరుగుతూ ఉందో దానిని కేవలం చూడండి మరియు మీరు దానికి అతీతంగా ఉన్నారు అని తెలుసుకోండి.

159.జనులందరిలో స్వరూపజ్ఞాని, ముక్తపురుషుడే విశ్వాసం ఉంచుటకు యోగ్యుడు. అయితే కేవలం విశ్వాసం ఉంచటమే సరిపోదు. మీ కోరికకూడా తీరాలి.

160.కోరిక మరియు విశ్వాసం కలిసి వెళుతూ ఉండాలి. మీ కోరిక ఎంతతీవ్రంగా ఉంటుందో, అంత సహజంగా మద్దతు లభిస్తుంది. శిష్యుడు ఒకవేళ నేర్చుకొనుటకు ఉత్సాహంగా లేకపోతే శ్రేష్ఠమైన గురువు కూడా ఏమీ చేయలేడు.

161.మనం ఎలా ఉన్నామో తెలుసుకుని మనలో యోగ్యమైనమార్పు తెచ్చుకొనేవరకు, ఇతరులను మార్చాలనే తొందరపడటం చేయకూడదు.

162.“నేను ఉన్నాను” ఈ ఒక్కమాటతోనే మీకు ఖచ్చితమైనవిశ్వాసం కలుగుతుంది. దీనిలో స్థిరపడిపో, ఇక మిగిలినదంతా వదిలెయ్. ఇదే యోగమార్గము.

163.ప్రపంచంతో కలిసిపోవడం, ఒకటవడం చేయవద్దు. అప్పుడు మీకు దుఃఖము అనుభవించాల్సిన పనిలేదు.

164.సాక్షీభావమును పెంచండి. అప్పుడు ఉదాసీనతతో తమకుతామే నియంత్రించుకునే శక్తి పెరగడంలాంటి అనుభవం మీకు వచ్చేస్తుంది. సాక్షీతత్వంయొక్క స్థితి సామర్థ్యశీలము అవుతుంది.

165.మీ అనుభవం లోనే ఎల్లప్పుడూ బిజీగా ఉండవద్దు. మీరు అనుభవం పొందేవాడికంటే కూడా అతీతంగా పుట్టుకలేని మరియు మృత్యువులేని వారు, ఇది ధ్యానంలో ఉంచండి. దానితో శుద్ధజ్ఞానగుణము, అపరిమితమైన జ్ఞానప్రకాశము ప్రకటమవుతుంది.

166.సాధనయే పరిపక్వమయ్యేటటువంటి ప్రక్రియ.

167.అనవసరమైనమాటలు మాట్లాడకపోవడమే, ఇదే తపస్సు. సుఖము మరియు దుఃఖములను కోరుకోకుండా ఉండటమే, ఇదే తపస్సు. ఎల్లప్పుడూ సంయమనంతో ఉండటం, ఇది కూడా తపస్సే.

168. మీ పని చేయండి, కొన్నిక్షణాలు విశ్రాంతిలో ఉండండి, అప్పుడు శాంతంగా ఉంటారు మరియు అంతర్ముఖులు అయిపోతారు. అవకాశం దొరకగానే దానిని కోల్పోకుండా ఉండటం మహత్వపూర్ణమైనది. మీకు ప్రీతిఉంటే విశ్రాంతిసమయాన్ని మీరు ఈపనికొరకు పూర్తిగా ఇవ్వండి. అది సరిపోతుంది.

169. అన్ని అనుభవాలకు మించి మీ ఆత్మపై ఆసక్తి పెట్టండి. ఆత్మవద్ద ఉండండి. ఆత్మను ప్రేమించండి. అంతిమనిశ్చలత్వం కేవలం స్వరూపజ్ఞానంలోనే ఉంది.

170.సంసారానికి అతీతంగా వెళ్ళుటకు మీకు సావధానత, స్థిరత్వం, మరియు శాంతము, లక్ష్యానికి అవసరము.

171.తమనుతాము అన్వేషించండి, ఇక అంతా ఆనందమయం అవుతుంది.

172.ఏదైతే జరుగుతుందో, అది నీ అస్తిత్వాన్ని తెలుపుతున్నది. నిర్దేశకులపై అంచనావేయండి మరియు వారిచేత ఏదైతే దర్శింపబడిందో దాని మీద ధ్యానం ఉంచండి. ఇది చాలా సులభమైనది. కానీ అది చెయ్యాలి. మీరు ఆత్మవైపు ఎంత తన్మయత్వంతో తిరిగివస్తారో, అదే మహత్వపూర్ణమైనది.

173.మీ ఉనికి యొక్క అనుభూతి లోలోతులలోకి వెళ్ళండి, దానిని విశాలం చేయండి, అదే ఏకైక రాజమార్గము.

174.ఉద్దేశ్యపూర్వకంగా, స్పృహతోటి, మీ అస్తిత్వం యొక్క అనుభూతిలో ఉండండి. చేతన యొక్క క్షేత్రమును విశాలంగా, లోతుగా చేయండి. ప్రతిసారీ మీమనస్సు చైతన్యం అవుతుంది. కానీ మీమనసే చైతన్యం. దీనికి చైతన్యం అవడం ఉండదు.

175.శాంతి మరియు నిశ్చలత లో మీ యొక్క ప్రగతి ఉంది.

176.ఒకవేళ మీరు అవగాహన, సృజనాత్మకత మరియు ఆనందంతో జీవించాలంటే మరియు ఆత్మ వైభవంలో వృద్ధితీసుకురావాలంటే మిమ్మల్ని మీరు అన్వేషించాలి.

177.కల్పనలను స్వీకరించకుండడం వాటిని సూటిగాఖండించడం, ఇదే సద్వస్తువును అన్వేషణ చేసే సాధకుని ఏకైక ధ్యానము. కల్పనల నుంచి విముక్తి అవ్వడమే ధ్యానము.

178.ఆలోచనలను ప్రవహింపనివ్వండి, వాటిని కేవలం అప్రమత్తంగా చూస్తూ ఉండండి, ఈవిధంగా మొదలుపెట్టండి. అప్రమత్తంగా గమనించటంచేత మనస్సుయొక్క కదలిక చాలానెమ్మది అవుతుంది. చివరలో అది పూర్తిగా ఆగిపోతుంది. ఒక్కసారి మనసు స్తబ్దంగా అవుతే, దానిని స్తబ్దంగా ఉంచండి. శాంతిగా ఆందోళనపడకుండా ఉండు. దానిలో విలీనం అవుతూ ఉండు, లోలోతులకు వెళ్తూ ఉండు.

179.మనసును "నేను ఉన్నాను" అనే భావన మీద స్థిరంగా ఉంచడం చేత, అది అనేక వృత్తుల వెనుక పరిగెత్తడం వదిలేసి సహజంగా నివృత్తి అయిపోతుంది.

180.ముక్తికొరకు సాధకుడు ఒకవేళ అంతఃకరణతో తపిస్తే అప్పుడే అతనికి ముక్తి లభిస్తుంది. నిజానికి స్వరూపం విముక్తమైఉన్నది. మీపని కేవలం దానిమీద ఉండే ఆభాసరూపమైన పైతెరను సులభంగా తొలగించడమే, ఇంత మాత్రమే.

181.ఏ మహత్త్వ ఆకాంక్ష కూడా ఆధ్యాత్మికము కానేకాదు. అన్ని గొప్ప ఆకాంక్షలు కూడా అహాన్ని పెంచడం మరియు పోషించడం కొరకే ఉన్నాయి. ఒకవేళ మీకు సత్యం గురించి ఏదైనా సాధించాల్సింది ఉంటే, అప్పుడు అన్ని వ్యక్తిగతమైన గొప్పఆకాంక్షలను వదిలేయండి.

182.ఒకవేళ మీకు శాంతి కావాలంటే దానికోసం మీకు ఎల్లప్పుడూ నిపుణత, తత్పరత ఉండాలి. స్వరూపంతో ఎడతెగని అనుసంధానం ఉండాలి. కేవలం సోమరిగా కూర్చోవడం వలన శాంతి లభించదు.

183.సద్గురువు కృప ఫలించడం కొరకు శిష్యుడు సద్గురువు యొక్క మాటలయొక్క భావానికి భావమై వాటిమీద విశ్వాసం ఉంచాలి. వారి మాటలను శ్రద్ధాపూర్వకంగా స్వీకరించడం చేయాలి.

184.మీరు ఏ స్వరూపజ్ఞానం కోరుతున్నారో, అది మీవెంట తానే స్వయంగా ఉన్నది. కానీ మీకు ‘‘అది ఉన్నది” అనే మాట మీద విశ్వాసము ఉండటంలేదు. ఏదైతే సహజంగా ఉందో, అది ఖచ్చితం అనే విశ్వాసం ఉంచండి, ఈనిర్ధారణతో వ్యవహరించండి.

185.అన్ని కోరికలు మరియు భయాల నుండి విముక్తి పొందుటకొరకు, గురుఆజ్ఞలను ఆచరించడం చాలా ప్రభావపూరితమైన సాధన.

186.సద్గురువుయొక్క మాటలమీద విచలితంకాని శ్రద్ధ మరియు తనబుద్ధి ద్వారా దానిలో కొంచెంకూడా జోక్యంచేసుకోకుండా ఉన్నదిఉన్నట్లుగా ఆచరించేటటువంటిపనిని ఒకవేళ శిష్యుడు ధారణచేస్తే గురువుయొక్క పని త్వరగా అయిపోతుంది.

187.ఎవరియొక్క ప్రభావశక్తి చాలాకాలం ఉంటుందో, వారంతా సత్యద్రష్టలు. వారివలె ఉచ్ఛతమమైన స్థితికి చేరండి మరియు సంసారాన్ని బాగుచేసేమాటలు మాట్లాడండి.

188.అజ్ఞానాన్ని, అజ్ఞానమని అర్థంచేసుకుని గుర్తించడమే జ్ఞానము. ఏదైతే కొనసాగుతున్నట్లు కనిపిస్తున్నదో, గ్రహింపబడుతున్నదో దానివెంట ప్రవాహంలో పడిపోకుండా దానిని వెలుపలనుండి సాక్షిగా చూడండి.

189.గురువు ద్వారా ఉపదేశం అయిన ప్రతి శబ్దము తమ యొక్క దైనందిన జీవితంలో ఆచరించుటకు దానిని అత్యంత కఠినంగా ప్రయత్నం చేయాలి. దానిని చేయకపోతే నాఅభివృద్ధి జరగదు అలా అభిప్రాయం పడవద్దు. ఉన్నతి నిశ్చితమైన తరువాత దానిలో ఒడిదుడుకులు ఉండొద్దు.

190. మీ సంసారం మీకే ప్రతిబింబము. ప్రతిబింబానికి దోషం అంటకండి. మీమీద ధ్యానం పెట్టండి.

191. మానసికమైన మరియు భావికమైన స్థాయిలో స్వయాన్ని సరిచేయండి. ఇక భౌతికజీవితం తనకుతానుగానే సరిఅవుతుంది.

192.మీరు ఆర్థిక, సామాజిక, రాజకీయమార్పులకు సంబంధించి ఇంతగా మాట్లాడుతున్నారు. మార్పు జరగనివ్వండి. మొట్టమొదట, మార్పుచేసే వారిపై ధ్యానం చేయండి.

193. మూర్ఖుడు, మూర్చితుడు, నిష్ఠురుడైనవ్యక్తి ఏవిధమైన సంసారాన్ని నిర్మాణం చేస్తాడు?

194.ఆత్మజ్ఞానము అనగా ఆత్మను గుర్తించటమే.

195.ఎప్పటి వరకు చేతన యొక్క గుర్తింపు జరగదో, అప్పటివరకు చేతన వెనుకఉన్న దాని అవగాహన జరుగదు.

*****

**సచిన్ క్షీరసాగర్**

**9028837976**

**బ్రాహ్మణపల్లి శ్రీధరబాబు**

**8919663003**